


# పాపన్న చదువు

ఒక ఊళ్ళో పాపన్న అనే కుర్రవాడుండే వాడు. చిన్నతనంలోనే వాడి తండ్రి చని పోగా, తల్లే వాణ్ణి కష్టపడి పెంచింది.

ఒకరికి సహాయపడట మంటే పాపన్నకు ఎంతో ఆనందం. ఇరుగు పొరుగు వాళ్ళకూ, ఎరిగినవాళ్ళకూ, ఎరగనివాళ్ళకూ, దారిలో కనిపించిన వాళ్ళకూ ఏ విధమైన సహాయం కావలిసి వచ్చినా సంతోషంగా చేసేవాడు. ఇతరులకు సహాయం చెయ్యేటప్పుడు వాడికి ఒళ్ళుపై తెలిసేదికాదు, తన సొంత పనులు కూడా మరిచిపోయేవాడు. అందుచేత వాడు గ్రామాని కంతటికీ జీతమూ, బత్తెమూ లేని నౌకరయాడు. వాణ్ణి అందరూ పరోపకారి పాపన్న అని పిలిచేవాళ్ళు.

అస్తమానం అందరికీ ఏదో రకమైన పనులు చేస్తూ ఉండటం వల్ల పాపన్న మంచి పనిమంతుడయాడు. అదీగాక వాడి సహాయం పొందినవారిలో కొంతమంది అయినా వాడి చేతిలో ఒక తినే వస్తువో, రెండు రాగి డబ్బులో పెడుతూండేవారు. (ఇవ్వకపోతే వాడు అడిగేవాడు కాడు, ఇస్తే తీసుకునేవాడు.) ఇదంతా చూసి వాడి తల్లి తన కొడుకు ప్రయోజకుడవుతాడని ఎంతో సంతోషించింది.

కాని రానురాను పాపన్న పరోపకార బుద్ధి గొప్ప అనర్థంగా తయారయింది. వాడు రోజూ నీళ్ళకోసం చెరువుకు వెళ్ళే వాడు. అక్కడ ఏ ముసలిదో, ముసలివాడో, "ఈ బిందె కాస్త సాయంపట్టు, నాయనా," అని అడిగితే, "ఎందుకులెండి. మీ ఇంటికి నేనే పట్టుకొస్తాను," అని తన బిందె అక్కడే వదిలేసి, వాళ్ళ బిందెను వాళ్ళ ఇంటికి చేర్చి మరీ వచ్చేడు.

ఈ ధోరణి చూసి తల్లి పాపన్నతో, "ఎంతసేపూ నువే ఇతరులకు సహాయం చేస్తున్నావు గాని, ఇతరులు కూడా నీకు

సహాయం చెయ్యవద్దట్రా? తనకు మాలిన ధర్మం ఎక్కడైనా ఉంటుందా? నీ కష్టానికి ఏదో కొంత ప్రతిఫలం లేకపోతే ఎలా, నాయనా?" అన్నది.

"వాళ్ళకె లేకపోతే, పాపం, మన కేమిస్తా రమ్మా?" అన్నాడు పాపన్న.

ఒక ఏడు ఉత్థాన ద్వాదశినాడు ఉదయం పాపన్న తల్లి దోసెలూ, పాయసమూ చెయ్యాలనుకున్నది. ఆమె పాపన్నకు డబ్బు లిచ్చి, "పప్పూ, బెల్లమూ, యాలకులూ తీసుకురా," అని పంపింది.

పాపన్న దుకాణానికి పోతుంటే, కందా రెడ్డి వీధి అరుగు మీద కూచుని ఉన్నాడు; ఆయన పాపన్నను చూడగానే, "పాపన్నా, కాస్త ఉపకారం చేసి పెట్టాలి. మా పని మనిషి రామి ఇంతవరకూ రాలేదు. కాస్త దాని గుడిసెకు వెళ్ళి, వెంటనే రమ్మంటు న్నారని పిలుచుకు రావాలి," అన్నాడు.

ఈ రామి రెండిళ్ళ వాళ్ళకు పాలు పోస్తుంది. ఉదయమే పాలు పితికి ఆ రెండిళ్ళ వాళ్ళకూ ఇచ్చి, కందారెడ్డి గారింట పనికి వెళుతూ ఉంటుంది. కాని ఈ రోజు పాలు పితకటం ఆలస్యమయింది. పాపన్న వచ్చి, "రెడ్డిగారు రమ్మంటున్నారు," అని చెప్పే సమయానికి అప్పుడే పాలు పితకటం పూర్తి చేసింది.



"అవును, నాయనా, ఇవాళ ఆవు మొండి కెత్తటం చేత పాలు పితకటం ఆలస్య మయింది. కాస్త ఈ పాలు వాడుక ఇళ్లకు చేర్చావంటే నేను ఇప్పుడే రెడ్డిగారింటికి బయలుదేరుతాను," అన్నది రామి.

ఇటు రామికీ, అటు కందారెడ్డిగారికీ కూడా ఉపకారం చేసినట్టుంటుందని పాపన్న పాలు తీసుకుని, రామి చెప్పిన రెండిళ్ళకూ అందించి, వస్తుండగా, నెత్తిన పెద్ద మూట పెట్టుకుని రొప్పుతూ, రోజుతూ పురోహితుడు సుబ్బశాస్త్రుల్లు ఎదురయాడు.

"సమయానికి కనపడ్డావు, పాపన్నా. బరువు మొయ్యలేక చస్తున్నాను. కాస్త ఈ మూట మా ఇంటి దాకా చేర్చుదూ, పుణ్యం ఉంటుందీ!" అన్నాడాయన.

"ఇవ్వండి, స్వామీ," అని పాపన్న పురోహితుడి మూటను వారింటిదాకా మోసుకు పోయి, అక్కడి నుంచి అంగడికి వెళ్ళాడు.

అంతకు మునుపే కరణంగారు ఒక మూట బియ్యం అంగడిలో కొని, కూలివాడి కోసం చూస్తున్నాడు. ఆయన పాపన్నను చూడగానె, "నాయనా, పాపన్నా, కూలి వాడు దొరకలేదు, కాస్త ఈ బియ్యం మా యింటికి చేరుస్తావా ఏమిటి? వంట సిద్ధమయి ఉంటుంది. అన్నం తిని మరీ వెళుదువు గాని!" అన్నాడు.



పాపన్న కరణంగా రింటికి బియ్యం చేర్చి అక్కడే భోజనం చేసి, ఆకలి బాధ తీరింది గనక మళ్ళీ పరోపకారం చేస్తూ మూడు ఝాములప్పుడు ఎవరి పని మీదనో తన ఇంటి వేపుగా వచ్చాడు.

తల్లి వాణ్ణి చూసి కేక పెట్టి పిలిచి, "పొద్దుననగా వెళితివి! పప్పూ, బెల్లమూ, యాలకులూ ఏవిరా ?" అన్నది.

"ఇదుగో, ఇప్పుడే వెళ్ళి తెస్తానమ్మా !" అన్నాడు పాపన్న.

"ద్వాదశి ఘడియలు దాటిపోయాక ఇప్పుడు తెచ్చి మాత్రం ఏం లాభం ?" అంటూ తల్లి వాణ్ణి గట్టిగా తిట్టింది.

ఇది జరిగినాక ఆమెకు పాపన్నను గురించి పెద్ద దిగులు పట్టుకున్నది. వాడి పరోపకార ధోరణిని, ఈ విధంగా సాగనిస్తే వాడు ఎందుకూ కొరగాకుండా పోతాడని అనుకుని, ఆమె కాస్త తెలిసిన వారిని సలహా అడిగింది.

"మంచి గురువు దగ్గిర చేర్చి చదువు చెప్పిస్తే పాపన్న బాగుపడిపోతాడు. ఆ పని చెయ్యి," అని పెద్దలు సలహా ఇచ్చారు. కోణంగిపురంలో ఒక గురువు ఉన్నాడు. పాపన్నను ఆయన దగ్గిరికి పంపటానికి తల్లి నిశ్చయించింది. పాపన్న కూడా కొత్త చోటికి వెళ్ళి కొత్త మనుషుల మధ్య తిరగటానికి ఉబలాటపడ్డాడు.

పాపన్నకు పనులు చెయ్యటంలో అమితమైన ఆనందం ఉందని గురువు త్వరలోనే గ్రహించాడు. ఆయన మూడు సంవత్సరాల పాటు పాపన్న చేత అంతులేని చాకిరీ చేయించుకుని, అక్షరజ్ఞానం కలిగించాడు. ఆ పైన, "పరోపకారార్థ మిదం శరీరం," "పరం పరోపకారార్థం యో జీవతి సజీవతి," "ఉపకారః పరోధర్మః" మొదలైన ముక్కలు, వాడికి నచ్చేవి నాలుగు చెప్పి, "నీ చదువయిపోయింది. వెళ్లిరా!" అన్నాడు.

[వచ్చే సంచికలో "రాజ సన్మానం"]





# రాజసన్మానం

చదువు పూర్తి అయిందని గురువుగారు చెప్పారు గనక పాపన్న ఇక ఇంటికి బయలుదేర వలసిన సమయం వచ్చింది. కాని వట్టి చేతులతో ఇంటికి వెళితే బాగుండదు. అందుచేత పాపన్న రాజాస్థానానికి వెళ్ళి తాను చదివిన చదువు కాస్త ప్రదర్శించి ఏదో ఒక బహుమానం పుచ్చుకుని ఇంటికి పోతే కొంచెం ఘనంగా ఉంటుందని నిశ్చయించాడు.

పాపన్న రాజనగరుకు పోయేదారిలో ఒక అరణ్యం ఉన్నది. అతను ఆ అరణ్యపు కాలి బాట వెంబడి నడుస్తూండగా, ఎదురు వైపు నుంచి, "పారి పోతున్నాడు, పట్టుకో! పట్టుకో!" అన్న కేకలు వినపడ్డాయి. ఆ క్షణంలోనే ఒక యువకుడు తన కేసి పరిగెత్తుకు వస్తూ ఉండటమూ, వాణ్ణి ఇద్దరు రాజభటులు తరుముతూ ఉండటమూ పాపన్న చూశాడు.

యువకుడు జుట్టు చెదిరి, బట్టలు చినిగి, అనుమానించదగినవాడుగా ఉన్నాడు. వాడు రాజ భటులకు చిక్కకుండా పారిపోతున్న నేరస్తుడని పాపన్న ఊహించాడు. అసలే పరోపకారి, అందులోనూ రాజ దర్శనార్థం వెళుతున్నవాడు; అందుచేత పాపన్న ఆ వచ్చే యువకుణ్ణి అవలీలగా పట్టుకుని రాజభటులకు అప్పగించాడు. వాళ్ళా యువకుడి నోట్లో గుడ్డలు కుక్కి, చేతులు విరిచి కట్టి, పాపన్నతో, "అయ్యా, సమయానికి వచ్చి సహాయపడ్డావు," అన్నారు.

"మీ రేమీ సంకోచించ వద్దు, మీకు నా వల్ల ఇంకే సహాయం కావలిసినా చేస్తాను," అన్నాడు పాపన్న.

"అయితే వీడి పని పూర్తి అయినదాకా మా వెంటనే ఉండు ఒకసారి వీడు మాకు చిక్కకూడా ఎలాగో కట్లు విడిపించుకుని మమ్మల్ని చావ గొట్టి పరిగెత్తాడు. మీరు



రాబట్టి మళ్ళీ మాకు దొరికాడు," అన్నారు రాజభటులు.

"సరే అయితే పదండి," అన్నాడు పాపన్న. వాళ్ళు అడవికి అడ్డం పడి ఒక నిర్జనమైన గుహ వద్దకు చేరుకున్నారు.

"ఇక్కడ మనకు తెల్లవారే లోపుగా పని ఉన్నది. దేవీ పూజ చెయ్యాలి. ఇక్కడే ఉంటాం," అంటూ వాళ్ళు పాపన్నను గురించి వివరాలు అడిగారు. తాను చదువు పూర్తి చేసి ధనార్జన కోసం నగరానికి పోతున్నట్టు పాపన్న వారితో చెప్పాడు.

రాజభటుల్లో ఒకడు, "నేనిప్పుడు నగరానికే పోతున్నాను. నీకు మంచి బహు

మానం ఇవ్వవలసిందనీ, మాకు ఎంతో సహాయం చేశావనీ మా నాయకుడితో చెబుతాను," అంటూ బయలుదేరిపోయాడు.

వాడు వెళ్ళిన కాస్సేపటికి రెండో రాజభటుడు, "మా వాడు రెండు మూడు గంటల దాకా రాడు. ఈ దుర్మార్గుడు చావ చితక కొట్టేశాడు. చాలా బడలికగా ఉంది. ఒక్క కునుకు తీస్తాను. నీవు మాత్రం వీణ్ణి జాగ్రత్తగా చూస్తూ ఉండు," అని నడుము వాల్చి నిద్రపోయాడు.

అంతకు ముందే వాళ్ళు ఆ యువకుణ్ణి అక్కడ ఉండే ఒక చెట్టు మానుకు కట్టేశారు. ఆ యువకుడు కొంచెం సేపు గడిచాక దాహం అవుతున్నట్టు పాపన్నకు సైగ చేశాడు. పాపన్న పరోపకార పారీణుడు గనక లేచి వెళ్ళి, కోనేట నుంచి ఆకు దొన్నెలో నీరు తెచ్చి, యువకుడి నోటిలో కుక్కిన గుడ్డలు లాగేశాడు.

అప్పుడా యువకుడు నీరు తాగి పాపన్నతో, "వీళ్ళు రాజ ద్రోహులు. నేను రాజు కొడుకును. ఈ భటు లిద్దరినీ మా సేనాపతి నాకు అంగరక్షకులుగా నియమించాడు. నేను వీళ్ళను వెంట బెట్టుకుని చీకటి పడే వేళకు, ఊరి వెలపల ఉండే కోవెలకు బయలుదేరాను. ఒక నిర్జనమైన

చోట ఇద్దరూ నా పైన పడి బంధించి అరణ్యా మార్గాన ఈడ్చుకు రాసాగారు. దారిలో నేను చేతి కట్లు ఎలాగో తప్పించుకుని వీళ్ళను మెత్తగా తన్ని పారిపోవటానికి యత్నించాను. ఇంతలో యమకింకరుడి లాగా నా ప్రాణానికి దాపరించావు. చూడగా నాకు సేనాపతి ఏదో పెద్ద దుర్మార్గం తల పెట్టినట్టున్నది. మా రాజ్యం కాజేస్తాడో ఏమో! నన్ని దుర్మార్గులు ఇక్కడ బలి ఇస్తారు. ఈ ద్రోహులలో ఒకడు నగరం వెళ్ళాడు. బహుశా సేనాపతితో నేను పట్టు పడ్డట్టు చెప్పటానికయి ఉంటుంది. నీవు చూస్తే వీళ్ళ మనిషివి లాగాలేవు. అలా టప్పుడు వీళ్ళ కెందుకు సహాయం చేస్తున్నావు?" అన్నాడు.

పాపన్న ఈ మాటలు విని విస్మయం చెందాడు. పరోపకార బుద్ధి తన చేత రాజ ద్రోహం చేయించిందని తెలుసుకుని, "రాజ కుమారా, నా కీ గొడవ ఏమీ తెలియదు. ఎవరికన్నా చేతనైన ఉపకారం చెయ్యటం మంచి పని అని చదువుకున్నాను. ఈ రాజ భటులు సాయం కోరారు, అందుకని సాయ పడ్డాను. మిమ్మల్ని విడిపిస్తాను. మీకు ద్రోహం తల పెట్టిన వారిని శిక్షించండి," అన్నాడు, యువరాజు కట్లు విప్పుతూ.




"నీవు కూడా నా వెంట వచ్చెయ్యి. లేకపోతే వీళ్ళ వల్ల నీకు ప్రమాదం!" అన్నాడు యువరాజు.

"ఫరవా లేదు. నేను బలశాలిని, ఇటు వంటి వెధవలకు పదిమందికి సమాధానం చెప్పగలను. వీళ్ళు పారిపోకుండా చూస్తూ ఉంటాను. మీరు వెళ్ళి నమ్మకమైన భటులను తీసుకురండి," అన్నాడు పాపన్న.

యువరాజు వెళ్ళిపోయాక పాపన్న పొదలచాటుకు వెళ్ళి నిద్రపోయే దొంగ లేవటం కోసం ఎదురు చూడసాగాడు. కొంత సేపటికి వాడు లేచి కూచుని యువకుడు లేకపోవటంతో కంగారు పడసాగాడు.

అప్పుడు పాపన్న ఇవతలికి వచ్చి, "ఇదేమిటి? ఆ ద్రోహిని వదిలినట్టున్నావే?" అని ప్రశ్నించాడు.

"ఛీ, నీవే ఆ పని చేసి ఉంటావు," అన్నాడు రాజభటుడి వేషంలో ఉన్నవాడు.

"నేనెందుకు వదిలి పెడతాను? వదిలి పెట్టేవాణ్ణయితే అసలు పట్టిస్తానా? ఇంకా నా కేదో మీ నాయకుడు బహుమతి ఇస్తాడని గంపెడాశతో ఉన్నాను. దాహమై కాసిని నీళ్ళు తాగి వచ్చేలోపుగా వాణ్ణి తప్పించేసి నా నోట కరక్కాయ కొట్టావు! పారిపోతున్న వాణ్ణి పట్టుకున్నానంటే మీ నాయకుడు ఎలా నమ్ముతాడు? నీ తరహా చూస్తే 'రాజద్రోహిలాగున్నావు!" అని రాజభటుడి పైన నేరం మోపాడు పాపన్న.

వాడు తెల్లపోయి, "నే నేమీ ఎరగను. ఇప్పుడే నిద్రలేచాను. వాడూ నువ్వూ కలిసి పారిపోయారని కూడా అనుకున్నాను. వాడంతట వాడు ఎట్లా తప్పించుకుంటాడూ? మా నాయకుడు వస్తే ఏమని చెప్పటం?" అని మథనపడ్డాడు. ఇంతలో మొదటి రాజభటుడు సేనాపతినీ, మరి ఇద్దరు భటులనూ తీసుకువచ్చాడు. "ఏడీ? ఆ రాజ కుమారుడి తల నా కళ్ళ ఎదట తెగితే చెరొక మాన్యమూ ఇచ్చేస్తాను," అంటూ సేనాపతి అటూ ఇటూ చూశాడు.



"అయ్యా, వీళ్ళకి సహాయం చేశాను. నా సేవ మరవకండి," అన్నాడు పాపన్న.

కాని రాజకుమారుడు తప్పించుకు పోయాడని తెలిశాక సేనాపతి ఉగ్రుడై పోయాడు. అయన నిప్పులు కక్కుతూ, ఒర నుంచి కత్తి దూసి ఇద్దరు రాజభటులనూ చంపబోయాడు.

"మహారాజా, తమరు తొందర పడకండి. రాజకుమారుడు దొరికిన మాట నిజమే. నేనే స్వయంగా పట్టుకున్నాను. అతణ్ణి ఇక్కడికి తెచ్చాం. చెట్టుకు కట్టాం. మీ కోసం వీడు బయలుదేరే సమయానికి రాజకుమారుడు చెట్టుకు కట్టే ఉన్నాడు గనక వీడి పైన ఆగ్రహించటం అన్యాయం. తరవాత ఈ రెండోవాడు కొంచెం సేపు నిద్రపోయిన మాట నిజమే. అదికూడా వాడి తప్పనటానికి లేదు. పాపం, వాణ్ణి రాజకుమారుడు చచ్చేటట్టు తన్ని హూనం చేసి నాకనే పట్టుబడ్డాడు. అదీగాక నేను రాజకుమారుడికి కాపలా ఉంటానని మాట ఇచ్చిన మీదటనే వాడు నిద్రపోయాడు. కాపలా ఉన్నవాణ్ణి మంచి నీటికని అలా వెళ్ళటం నాదే పొరపాటు. నేను తాగి దొన్నెతో తెచ్చాను—వీడు నిద్రలేచి దాహమంటాడేమోనని. ఇదుగో చూడండి ఆ నీరింకా అలాగే ఉన్నది. రాజకుమారుడు



పారిపోయిన నేరం న్యాయంగా నాదే, కావలిస్తే నా తల తీయండి!" అన్నాడు పాపన్న. రాజకుమారుడు ఎలా మాయమయిందీ సేనాపతికి అంతు చిక్కలేదు. "కట్టు తాళ్ళుకూడా లేవు. వాడు ఏ పొదలో నన్నా దూరాడేమో వెతకటం మంచిది," అని పాపన్న సలహా ఇచ్చిన మీదట అక్కడి పొదలన్నీ గాలించ నారంభించారు.

ఇంతలో రాజకుమారుడు వందమంది యోధులతో చడీ చప్పుడూ లేకుండా వచ్చి, సేనాపతినీ, అతని భృత్యులైన నలుగురు భటులనూ పట్టుకున్నాడు.

అందరూ కలిసి నగరానికి వెళ్ళేటప్పుడు పాపన్నకూడా వెంట వెళ్ళాడు. సేనాపతిని విచారణ చేశారు. ఆయన తన కేమీ తెలియదనీ, రాజకుమారుణ్ణి పట్టుకుపోయిన వారికి శిరచ్ఛేదం విధించవలసిందేననీ అన్నాడు. రాజకుమారుడి తల తన ఎదట తెగితే మాన్యంయిస్తానని సేనాపతి అన్నట్టు పాపన్న సాక్ష్యం చెప్పాడు. సేనాపతికి మరణ దండన విధించారు.

పాపన్న ఆ రోజు రాజకుటుంబం పాలిటికి ఒక దేవుడయాడు. అతనికి ఎన్నో కానుక లిచ్చారు. ఎంతో గొప్పగా సన్మానం చేసి, ఆతిథ్యం ఇచ్చారు. తరవాత రాజకుమారుడు అతన్ని కొలువులో ఉండమని కోరాడు. పాపన్న ఇంటికి వెళ్ళి తల్లికి కనపడి మళ్ళీ వస్తాననీ, తాను ఇల్లు వదిలి చాలా ఏళ్ళయిందనీ చెప్పి, తనకు వచ్చిన కానుకలూ, తన తల్లికి రాణీగారిచ్చిన కానుకలూ పుచ్చుకుని ఇంటికి బయలుదేరాడు.

"దారిలో దొంగల భయం ఉంటుందేమో, భటులను వెంట పంపిస్తాను," అన్నాడు రాజకుమారుడు.

"నా కేమీ భయం లేదు. నాకు నేనే రక్షకుణ్ణి," అంటూ పాపన్న రాజకుమారుడి వద్ద సెలవు పుచ్చుకున్నాడు.

—[పై సంచికలో మరొక సంఘటన]






# నిలబెట్టిన కాపరం

రాజుగారిచ్చిన వెయ్యి వరహాల సంచీ రొండిన కట్టుకుని పాపన్న తన గ్రామానికి బయలుదేరాడు. అతను ఒక కొండ పక్కగా పోతూ ఒక మలుపు తిరిగే సరికి, చెట్టుకు ఉరిపోసుకు చావటానికి ప్రయత్నం చేస్తున్న ఒక యువకుడు అతనికి కనిపించాడు. చూడటానికి వాడు పెళ్ళికొడుకులాగా, కొత్త బట్టలు కట్టుకుని ఉన్నాడు కూడా. పాపన్న అతని చేతిలో ఉన్న ఉచ్చు లాగేసుకుని, చెట్టు కొమ్మకు కట్టి ఉన్న తాటిని ఒక్క గుంజు గుంజి తెంచి, "నీ కేం కష్టం వచ్చింది? ఎందుకు చావాలను కుంటున్నావు? నా వల్ల ఏమైనా సహాయం కావాలంటే చెప్పు చేస్తాను," అన్నాడు.

ఈ మాటలు విని ఆ యువకుడు, "నన్నెందుకు చావనిచ్చావు కావు? నేను బతికి ఉంటే అన్నీ కష్టాలే. కనీసం నూరు వరహాలైనా లేందే నా మానం దక్కదు. నా కిప్పుడు నూరు వరహాలు ఎవరిస్తారు? లోకంలో అటువంటి దాతలే ఉంటే నేను ఆత్మహత్య చేసుకునే పరిస్థితి రాకనే పోను!" అంటూ ఏడవ నారంభించాడు.

పాపన్న వాణ్ణి ఓదార్చి, "ఏడవకు, నీకు కావలిసిన నూరు వరహాలూ నే నిస్తాను. వాటితో నీ కష్టాలు గట్టెక్కే పక్షంలో సుఖంగా బతుకు," అంటూ రొండి నున్న సంచీ విప్పి, నూరు వరహాలు ఎంచి ఆ యువకుడి చేతిలో పోశాడు.

ఆ యువకుడు వాటిని అందుకుంటూనే ఎటో పారిపోయాడు. వాడి ప్రవర్తన చూసి పాపన్నకు ఆశ్చర్యం కలిగింది. తాను బుద్ధిపూర్వకంగా ఇచ్చిన సొమ్మేగదా, దొంగతనం చేసిన వాడిలాగా ఎందు కలా పారిపోవాలి? ఎంత ఆలోచించినా ఈ ప్రశ్నకు సమాధానం దొరకలేదు. పాపన్న చుట్టూ కలయ జూడగా ఒక చిన్న మూట కని




పించింది. ఆ మూట ఆ యువకుడిదే అయి ఉండాలి. ఎందుకంటే, ఆ యువకుడు ధరించిన కొత్త బట్టలలాటివే మరొక జత ఆ మూటలో పాపన్నకు కనపడింది. అతను తన కుళ్ళు గుడ్డలను విప్పేసి ఆ కొత్త బట్టలు కట్టుకుని తన దారిన బయలుదేరాడు.

పాపన్న కాపాడిన యువకుడు ఒక అభాగ్యుడు. వాడి పేరు శ్యామన్న. వాడికి తండ్రి లేడు. చిన్నతనం నుంచీ చెడు సహవాసాలు చేసి, తల్లి మాట వినక డబ్బంతా తగలేసి, చివరకు అప్పులపాలయాడు. బాకీదార్లు తొందర పెట్టసాగారు.

శ్యామన్నకు అయిదేళ్ళ క్రితం పెళ్ళి అయింది. భార్య ఈడేరినా కూడా వాడామెను కాపరానికి తెచ్చుకోలేదు.

ఆమెను తీసుకు పొమ్మని మామగారు తొందర పెట్టసాగాడు.

ఒక వంక బాకీదార్లు ఇల్లు స్వాధీనం చేసుకుని తల్లినీ తననూ ఇంటి నుంచి గెంటే లాగున్నారు. మరొక వంక భార్యను తీసుకుపొమ్మని మామగారు ఒత్తిడి చేస్తున్నాడు. ఈ పరిస్థితిలో ఏమి చెయ్యాలో శ్యామన్న తేల్చుకోలేక పోయాడు. వాడి అప్పుల మాట తల్లికి తెలియదు. అందుచేత ఆమె వాణ్ణి పోరి అత్తవారింటికి పంపింది.

అత్తవారు సంతోషించి వాడికి కొత్తబట్టలు పెట్టి మర్యాదలన్నీ చేసి రెండు రోజులుండమని బతిమాలారు. కాని వాడు వాళ్ళ మాట వినక తన భార్యతోసహా వచ్చిన రోజు సాయంకాలమే ఇంటికి బయలుదేరాడు. త్వరలోనే చీకటి పడింది. భార్యా భర్తలు ఆ రాత్రి ఏ చెట్టు కిందనో పడుకున్నారు. భార్యకు కాస్త కునుకు పట్టగానే శ్యామన్న లేచి తప్పటు దారిన బయలుదేరి పర్వతం సమీపానికి వచ్చాడు. తాను ప్రాణం తీసుకోవటం తప్ప మరే మార్గమూ లేదనిపించింది. వాడా పని చేసే ప్రయత్నంలో

ఉండగా, దేవుడల్లే పాపన్న వచ్చాడు. అతడికి బాకీలు తీర్చటానికి సరిపడే సొమ్ము కూడా ఇచ్చాడు.

శ్యామన్న మొదటి ఆలోచన ఆ నూరు వరహాలూ పాపన్న మళ్లీ తీసేసు కుంటాడనే. ఆ భయంతోనే వాడు తన మూట కూడా మరిచి పారిపోయాడు. కాని కొంత దూరం వెళ్ళాక వాడికి మరొక ఆలోచన వచ్చింది. ఈ నూరు వరహాలతో ఇల్లు మాత్రమే దక్కుతుంది. అయితే పాపన్న సంచీలో ఇంకా ఎన్నో వరహాలున్నాయి. అవికూడా సంపాదించ గలిగితే తాను నిశ్చింతగా కొంత కాలంపాటు ఒక వెలుగు వెలగవచ్చు.

శ్యామన్న పాపన్నను దొంగ దెబ్బ కొట్టి అతని వద్ద ఉన్న సంచీ కాజెయ్యా నిశ్చయించుకుని, ఒక పెద్ద రాయి తీసుకుని పాపన్న వచ్చే దారిలో మాటు వేసి కూచున్నాడు. కొంతసేపు గడిచాక పాపన్న అటుగా వచ్చాడు. అతణ్ణి దాటి పోనిచ్చి వెనక పాటున శ్యామన్న పాపన్న తల మీద రాయితో బలంగా కొట్టాడు. పాపన్న స్పృహ తప్పి పడిపోయాడు. శ్యామన్న అతని రొండిన ఉన్న సంచీ తీసుకుని దూరంగా వెళ్ళి, ఒక రహస్య ప్రదేశంలో సంచీ విప్పి వరహాలు ఎంచుకున్నాడు.



అంత డబ్బు చేతికి రాగానే శ్యామన్న మనస్థితి పూర్తిగా మారిపోయింది. ప్రాణం మీద మమత తిరిగి వచ్చింది, భార్య మీద ఎక్కడలేని అభిమానమూ పుట్టు కొచ్చింది. తాను అదివరకు గడిపిన జీవితం మీద రోతకూడా పుట్టింది. ఇక నుంచి సన్మార్గంలో బతకాలని నిశ్చయించుకున్నాడు.

తన భార్య ఏమై ఉంటుందా అనుకుని శ్యామన్న, పుట్టింటికే తిరిగి వెళుతుందని నిశ్చయించుకున్నాడు. తన దగ్గిర ఇప్పుడు పుష్కలంగా డబ్బు ఉన్నది గనక, పట్నం వెళ్ళి భార్యకు నగలూ, చీరెలూ కొనుక్కుని, అత్తవారింటికి వెళ్ళి, అక్కడ కొన్ని రోజులు

సరదాగా గడిపి తరవాత తన గ్రామం వెళ్ళ టానికి నిశ్చయించుకున్నాడు.

తెల్లవారినాక శ్యామన్న నగరం చేరు కున్నాడు. నగల వర్తకుడి దుకాణంలోకి వెళ్ళి నగలు బేరం చెయ్యసాగాడు. అయితే శ్యామన్న చేతిలో ఉన్న సంచీపై రాజ ముద్ర ఉండటం గమనించి నగల వర్తకుడు రహస్యంగా తన మనిషి ద్వారా రాజుగారికి కబురు పంపి, నగలు చూపించే మిష మీద కబుర్లు చెబుతూ శ్యామన్నను చాలాసేపు దుకాణంలో కూర్చోబెట్టాడు.

చివరకు రాజభటులు వచ్చి, శ్యామన్నను పట్టుకుని రాజుగారి ఎదట పెట్టారు. సంచీని రాజుగారు గుర్తించాడు. అందులో ఉన్న సొమ్ము ఎంచితే లెక్క ప్రకారం వెయ్యి వరహాలూ ఉన్నాయి. ఒక్క వరహా ఖర్చు చెయ్యటానికి కూడా శ్యామన్నకు అవకాశం దొరక్క పోయింది.

"నీ కీ సంచి ఎలా వచ్చింది?" అని రాజుగారు అడిగితే శ్యామన్న, ఎవరో దాత ఇచ్చాడని చెప్పాడు. ఎందు కిచ్చాడంటే చెప్పలేకపోయాడు.

"మీదే గ్రామం?" అని అడిగితే శ్యామన్న తన గ్రామం పేరు చెప్పక మరొక గ్రామం పేరు చెప్పాడు. ఆ గ్రామంలో వారిని గురించి ఏమీ చెప్పలేక పోయాడు,



రాజుగారు అనుమానం మీద శ్యామన్నను ఖైదు చేయించి, పాపన్న క్షేమంగా ఇల్లు చేరినదీ లేనిదీ తెలుసుకురమ్మని భటులను పాపన్న ఇంటికి పంపాడు.

ఈ లోపల అక్కడ శ్యామన్న భార్య పద్మ, తన భర్త లేచి వెళ్ళిపోయిన కొద్ది సేపటికే నిద్రలేచింది. తన భర్త తనను ఒంటరిగా వదిలి ఎటో వెళ్ళిపోయాడని నిశ్చయించుకున్నాక ఆమె శ్యామన్న ఊహించినట్టు పుట్టింటికి పోలేదు. అత్త వారింటికి వెళ్ళిపోవాలని ఆమె చాలా కాలంగా తహతహ లాడుతున్న మనిషి కావటం చేతనూ, పుట్టింటికి తిరిగివెళితే అందరూ "నీ భర్త ఏమయాడు?" అని అడుగుతారన్న లజ్జతోనూ పద్మ ముందుకే సాగింది. ఎవరినన్నా అడిగి దారి తెలుసుకుంటూ అత్తవారి ఊరు వెళ్ళిపోవాలని ఆమె ఉద్దేశం.

చాలా సేపు నడిచి ఆమె పాపన్న పడి ఉన్న చోటికి వచ్చింది. అతను ధరించిన బట్టలు తన భర్తకు తన వాళ్ళు పెట్టినవే కావటం చేత ఆ పడి ఉన్నది తన భర్తే అనుకున్నది. అదీగాక ఆమె ఇంతవరకు భర్త ముఖం ఎలా ఉంటుందో సరిగా ఎరగదు. తన భర్తను ఎవరో కొట్టారని అదుర్దా పడుతూ ఆమె పాపన్నకు శైత్యోపచారాలు





పాపన్న జరిగినదానికి చింతించే రకం కాదు. అతను లేచి బట్టలు దులుపుకుని తన దారిన తాను స్వగ్రామం కేసి బయలు దేరాడు. పద్మ అతనికి కొంచెం వెనకగా మౌనంగా నడవసాగింది.

ఈ సంగతి గమనించి పాపన్న వెనక్కు తిరిగి, "ఏమమ్మా, ఎవరు నీవు? నీకు తోడెవరూ లేరా? ఎక్కడికి పోతున్నావు? అవసరమైతే నేను నిన్ను నీవు పోవలిసిన చోట వదిలి నా దారిన నేను పోతాను. పరోపకారం చెయ్యమని మా గురువుగారు నాకు బోధించారు," అన్నాడు.

అతని మాటలు విని పద్మ, దొంగలు కొట్టిన దెబ్బతో తన భర్తకు మతి చెడిం దనుకుని, "మీరు తప్ప నా కెవరున్నారు? నే నెక్కడికి పోగలను? మీ రెక్కడికి పోతే నేను అక్కడికి పోవలిసిన దాన్నే!" అన్నది.

ఈ మాటల అంతరార్థం పాపన్నకు తెలియలేదు. అయినా అతను నిస్సం కోచంగా, "అయితే, నేను మా ఇంటికే పోతున్నాను. నా వెంట వచ్చెయ్యి. మా అమ్మ నీ సంగతి అంతా చక్కగా విచా రిస్తుంది," అన్నాడు.

ఈ మాటలు విని పద్మ ఎంతో సంబర పడింది. ఇద్దరూ పాపన్న ఇంటికి చేరు

చేసింది. పాపన్న త్వరలోనే తేరి కూచున్నాడు. తల వెనక భాగం తడివి చూసుకుంటే బొప్పి కట్టి ఉన్నది. అసలే దృఢమైన మనిషి కనక దాన్ని ఆతను లక్ష్య పెట్టలేదు. అతను పద్మను చూసి, "ఎవరో ఈ మనిషి?" అనుకున్నాడు. అతనికి స్పృహ రాగానే పద్మ దూరంగా వెళ్ళి తల వంచుకుని నిలబడటం చేత ఆమె తనకు శైత్యోపచారాలు చేసిన సంగతి కూడా పాపన్న ఎరగడు. అతను తన సంచీ కోసం తడువుకుని, "నన్ను కొట్టి దొంగ లెవరో నా సంచీ ఎత్తుకుపోయారు," అన్నాడు. పద్మ మాట్లాడలేదు.




కున్నారు. పాపన్న కోసం అతని తల్లి ఎంతో ఆదుర్దాగా వేచి వున్నది. ఆమె పాపన్నను చాటుకు పిలుచుకుపోయి ముందుగా పద్మ విషయం అడిగింది.

"ఈమె ఎవరో నాకు తెలియదమ్మా. దారిలో కలిసింది. ఒంటరిది లాగుంది. నా వెంట పడి వచ్చింది. దిక్కులేని మనిషి కాపాలని వెంట తెచ్చాను. నేను ఏదన్నా అడిగితే సరిగా చెప్పటానికి సిగ్గు పడి తల వంచుకుంటున్నది. నీవే ఆమె విషయం విచారించు, చేతనైన సహాయం చేద్దాం," అన్నాడు పాపన్న.

తరవాత అతను తల్లికి తన చదువు గురించి, రాజకుమారుణ్ణి రక్షించటం గురించీ, రాజుగారు చేసిన సన్మానం గురించీ, ఇంటికి వస్తుండగా ఆత్మహత్యా ప్రయత్నంలో ఉండిన యువకుణ్ణి గురించీ, తరవాత తనను దారిలో దొంగలు కొట్టి వరహాల సంచీ కాజేయటం గురించీ సవిస్తరంగా చెప్పాడు.

ఇదంతా పక్కన ఉండి వింటున్న పద్మకు రెండు విషయాలు స్పష్టంగా తెలిసి పోయాయి: ఈ పాపన్న తన భర్తకాడు; తన భర్త తనను ఒంటరిగా విడిచిపోయినాక ఆత్మహత్య చేసుకోపోయి, పాపన్న చేత రక్షించబడి, అతని వద్ద నూరు వరహాలు కూడా పుచ్చుకున్నాడు. ఆ తరవాత తన భర్త ఏమయాడో ఆమె ఏమాత్రం ఊహించ లేక పోయింది.

ఇంతలోనే రాజభటులు వచ్చి చేరారు. ఒక యువకుడు వెయ్యి వరహాలూ, రాజ ముద్రలూ గల సంచీతో పట్టుబడ్డాడని వారు పాపన్నతో చెప్పారు. పాపన్న తన సంచీ పోయిన సంగతి వారితో చెప్పి, "అందులో తొమ్మిది వందల వరహాలే ఉండాలి. రాజుగారు నా కిచ్చిన వెయ్యిలో ఒక వంద వరహాలు ఒక అభాగ్యుడికి ఇచ్చాను," అన్నాడు. అతని సంచీ నుంచి తీసి తాను

కట్టుకున్న కొత్త బట్టలుకూడా రాజ భటులకు చూపాడు.

దొరికిన దొంగ అలాటి బట్టలే కట్టుకుని ఉన్నాడని రాజభటులు చెప్పారు. తన సంచీ కాజేసినవాడు తన చేత రక్షించబడిన వాడేనని పాపన్నకు తెలిసిపోయింది. దొంగ తన భర్తేనని పద్మకుకూడా తెలిసిపోయింది. ఆమె ఏడుస్తూ పాపన్న కాళ్ళ పై పడి, "బాబూ, నా భర్తకు శిక్ష పడకుండా చూడండి. నా కాపరం నిల బెట్టండి," అని బతిమాలింది.

పాపన్న పద్మను దుఃఖించ వద్దని చెప్పి రాజభటుల వెంట రాజుగారి వద్దకు వెళ్లాడు. చెరలో ఉన్న శ్యామన్నను గుర్తు పట్టాడు. శ్యామన్న తాను చేసిన ద్రోహం ఒప్పుకుని, తన పేదరికం ఎలాటిదో వివరించి, బాపురు మని ఏడిచాడు.

శ్యామన్న కోసం కాకపోయినా, ఏ పాపమూ ఎరగని పద్మ సౌఖ్యం కోరి పాపన్న రాజకుమారుడితో, "శ్యామన్నను శిక్షించ కండి. కావలిస్తే వాడి శిక్ష నేను అను భవిస్తాను. ఆ పిల్ల చాలా మంచిది. కొత్తగా కాపరానికి వస్తున్నది. భర్తతో సుఖపడాలని ఎంతగానో కలలు కన్నది. నా వెయ్యి వరహాలూ వాళ్ళకే ఇవ్వ నిశ్చయించాను. ఒకరికి కష్టం కలిగించటం తేలిక, సుఖం కలిగించటం గొప్ప విషయం!" అన్నాడు.

పాపన్న చెప్పిన మాటల ఫలితంగా రాజ కుమారుడు శ్యామన్నను శిక్షించకుండా వదిలి పెట్టటమేగాక అతను భార్యతో సుఖంగా కాపరం చెయ్యటానికి తగినంత ధనంకూడా ఇచ్చాడు.

పాపన్న శ్యామన్నను తన ఇంటికి తీసుకు పోయి అతనికి పద్మను వప్పగించి, "ఇది వరకు ఏం చేశావో చేశావు, ఇకనైనా బుద్ధిగా బతుకు. నీ భార్య రత్నం లాటిది," అని హితవు చెప్పి పంపేశాడు.

[వచ్చే సంచికలో మరో సంఘటన]





# తప్పిపోయిన పెళ్ళి

పాపన్న పెళ్ళి చేసుకుని ఒక ఇంటివాడైతే బాగుండునని అతని తల్లి అనుకున్నది. ఎందుకంటే పాపన్న చదువుకున్నాడు, రాజ బహుమానం కూడా పొందాడు, పెళ్ళీడు వాడయాడు.

అయినా ఊళ్ళో వారెవరూ పాపన్నకు పిల్లనిస్తామని ముందుకు రాలేదు. ఎందుకంటే, అతను ప్రయోజకుడన్న నమ్మకం ఎవరికీ కుదరలేదు. ఇప్పటికీ అతను అస్తమానమూ పరోపకారం చెయ్యటంలోనే మునిగి ఉంటున్నాడు గాని తన సొంత వ్యవహారాలేమీ చూసుకోవటం లేదు. అసలు అతను ఇంట్లో ఒక్క క్షణం ఉండడు. అందుచేత పెళ్ళి చేసినా పాపన్న ఇంటి పట్టున పడి ఉండడని, పెళ్ళాం కష్టసుఖాలు పట్టించుకోడని ఊళ్ళోవాళ్ళు అనుకున్నారు.

పాపన్న కోసం పిల్లలను వెతికించగా వెతికించగా మూడు కోసుల దూరాన ఒక పిల్ల ఉన్నట్టు తెలిసింది. పాపన్న తల్లి తమ ఊరి నుంచి ఒక శాస్త్రుల్లుగారిని పంపి ఆ సంబంధం మాట్లాడించింది. ఆ పిల్ల అందంగానే ఉంటుంది గాని అనాథ. చిన్నతనం నుంచీ ఎవరో శ్రీమంతులు చేరదీసి పెంచారు. వారింట ఆ పిల్ల పనులు చేస్తున్నది. ఆమె పేరు లక్ష్మి. పసితనం నుంచీ పెంచి పెద్ద చేసిన శ్రీమంతులు, ఎవరు తమకు నూరు వరహాలిస్తే వారికా పిల్లనిస్తామన్నారు. వారు కోరినట్టు నూరు వరహాలూ ఇచ్చి ఆ పిల్లను తెచ్చి తన కొడుక్కు చేసుకోవటానికి పాపన్న తల్లి నిశ్చయించింది.

పాపన్న కూడా తనకు పెళ్ళి కాబోతుందని సంబరపడ్డాడు. అయితే అతనికి పిల్లను ముందుగా చూడాలనిపించింది. కాని ఈ మాట పైకి అంటే అందరూ నవ్వుతారనుకుని, పెళ్ళికూతురికి నగలు కొనే నెపం మీద పట్నానికని బయలుదేరాడు పాపన్న.

పరోపకారి పాపన్న కథలు—4



సంబంధం మాట్లాడి వచ్చిన శాస్త్రుల్లు గారు పిల్ల చేసే పనులను గురించీ, ఆమె ఉండే శ్రీమంతుల ఇంటి గుర్తులూ అవీ, చాలా చెప్పాడు. లక్ష్మి తెల్లవారుజామునే పశువులకు పాలు తీస్తుంది. ఆ సమయంలో ఆ గ్రామం చేరుకునే ఉద్దేశంతో పాపన్న డబ్బు సంచీ రొండిన కట్టి మూడవ జామునే ఇల్లు కదిలాడు.

పాపన్న సగం దూరం వెళ్ళాడో లేదో అతనికి ఒక బండీ ఎదురయింది. బండి ఒక పక్కగా ఏటవాలుగా నిలబెట్టి ఉన్నది. దానికి ఎద్దు లేదు. బండి పక్కన ఒక యువతీ, యువకుడూ ఉన్నారు. యువకుడు బాధతో మూలుగుతున్నాడు. వాడికి యువతి ఏవో ఉపచారాలు చేస్తూ, కన్నీరు కారుస్తూ, "అయ్యో, ఎంత చిక్కు వచ్చింది! నీవు బండి లాగలేవు. దెబ్బ బలంగానే తగిలింది. ఇప్పుడు మన గతి ఏమిటి?" అని వాపోతున్నది. పాపన్న పరుగున వారిద్దరినీ సమీపించి, "మీ కిప్పుడు వచ్చిన చిక్కేమిటి? నా వల్ల ఏమైనా సహాయం కావాలంటే చెప్పండి. పరోపకారార్థ మిదం శరీరం!" అన్నాడు.

"అయ్యా, నా పేరు రంగడు. మేమిద్దరమూ తెల్లవారే లోపల చాలా దూరం వెళ్ళాలి. ఎద్దు లేక పోవటం చేత నేనే బండి లాగుతూ, చీకట్లో ఎదురు దెబ్బ తగిలి పడ్డాను. గాయమయింది. ఈ బాధతోనూ, ఈ కాలితోనూ నేనిక బండి లాగలేను. మేము తెల్లవారే లోగా మా ఊరు చేరకపోతే మా యిద్దరి బతుకూ భ్రష్టమై పోతుంది!" అన్నాడు యువకుడు.

"అందుకు మీరేమీ విచారించ వద్దు. నేను బలశాలిని. నీవు కూడా బండి ఎక్కి నాకు దారి చెప్పు, నేను బండి లాగుతాను," అన్నాడు పాపన్న.

"ఆ పని చేస్తే బతికి పోతాం, బాబూ!" అంటూ ఆ యువతీ యువకులు బండి

ఎక్కారు. పాపన్న బండి లాగుతూ, "మీరిద్దరూ దంపతులా?" అని అడిగాడు.

"మా కింకా పెళ్ళి కాలేదనుకోండి. ఊరు చేరగానే చేసేసుకుంటాం. ఇది ఒక దిక్కులేని పిల్ల. ఒక ధనికుల ఇంట పని మనిషిగా ఉంటున్నది. దీన్ని చిన్నతనం నుంచి వారే పెంచారు. నేను వాళ్ళ పొరిగింట పని చేస్తూ ఉంటాను. చాలా కాలంగా మేమిద్దరమూ ప్రేమించుకున్నాం. దాన్ని నేను పెళ్ళి చేసుకుంటానని దాని యజమానిని అడిగానుకూడా. నూరు వరహాలిస్తే ఒప్పుకుంటానన్నాడు. నా దగ్గర నూరు వరహాలు కాదుగదా రెండు వరహాలుకూడా లేవు. అందుచేత ఏమీ చెయ్యలేక పోయాం. ఇంతలో పొరుగూరు నుంచి ఎవరో నూరు వరహా లిస్తామని కబురు వేశారు. దీని యజమాని ఒప్పుకున్నాడు. దీన్ని చేసుకో బోయేవాడు ముసలిముద్ర అని తెలిసింది. ఈ మాట విని అది ఏడిచింది. మేమిద్దరమూ రహస్యంగా మా తాతగారి ఊరు పారిపోవటానికి నిశ్చయించుకుని అర్ధరాత్రి వేళ బయలుదేరాం. కాని మధ్యదారిలో నాకీ దెబ్బ తగిలింది. ఇంతలో దేవుడల్లే మీరొచ్చి మమ్మల్ని కాపాడారు!" అన్నాడు రంగడు. ఈ కథ అంతా వినకముందే పాపన్న




బండి లాగటం మానేసి నిలబడి పోయాడు. చివర కతను, "ఈ పిల్ల పేరేమిటి?" అని అడిగాడు. "లక్ష్మి," అని రంగడు చెప్పాడు.

"అయితే మీరు పారి పోవలసిన అవసరం లేదు. తిరిగి పోదాం," అంటూ పాపన్న బండిని తిప్పాడు.

"ఉండండి, ఉండండి! మేం ఆ ఊరులో కనిపిస్తే మమ్మల్నిద్దర్నీ చీలుస్తారు!" అని రంగడు విలవిల లాడాడు.

"ఆ ధనికుడికి డబ్బివ్వకుండా లక్ష్మిని ఎత్తుకు పోవటమే అసలైన నేరం! హాయిగా డబ్బు పారేసి, మహారాజులాగా పెళ్ళాడు!" అన్నాడు పాపన్న.

"నా దగ్గిర చిల్లి గవ్వ లేదని, లోగడే చెప్పావుగదా," అన్నాడు రంగడు.

"నా దగ్గిర డబ్బున్నది. నీకు కావలిసిన నూరు వరహాలూ నే నిస్తాను, సరేనా?" అన్నాడు పాపన్న.

వారు ముగ్గురూ లక్ష్మి ఉండే గ్రామం చేరే సరికి తెల్లవారి పోయింది.

లక్ష్మి పారిపోయిందని అప్పటికే తెలిసి శ్రీమంతుడు ఉగ్రుడై పులిలాగా అటూ ఇటూ పచార్లు చేస్తున్నాడు. పాపన్న ఆయనతో, "అయ్యా, ఇదుగో నూరు వరహాలు! ఈ రంగణ్ణి లక్ష్మిని పెళ్ళాడ నివ్వండి. నూరు వరహాలు ఎవరిస్తే వారికి లక్ష్మి నిచ్చేస్తామన్నారుట గదా!" అన్నాడు.

"నిజమే కాని లక్ష్మిని పాపన్న అనే అతనికి ఇచ్చి చేస్తానని మాట ఇచ్చేశాను. రేపో ఎల్లుండో వారు పైకం తీసుకు వస్తారు. లక్ష్మిని రంగడికిస్తే నేను మాట తప్పిన వాణ్ణవుతాను," అన్నాడు శ్రీమంతుడు.

"ఆ భయం మీ కేమీ వద్దు. ఆ పాపన్నని నేనే. పాపం, వాళ్ళిద్దరూ చాలా కాలంగా ఒకరినొకరు ప్రేమించుకున్నారుట. నేను ఈ పిల్లను కాకపోతే మరొక పిల్లను చేసుకుంటాను," అన్నాడు పాపన్న. రంగడూ, లక్ష్మి పాపన్న కాళ్ళపైన పడి, మట్టిబుర్ర అన్నందుకు క్షమాపణ చెప్పుకున్నారు.

పాపన్నయొక్క పరోపకార బుద్ధి చూసినాక శ్రీమంతుడికి డబ్బు తీసుకోవటానికి చేతులు రాలేదు. "నాకు డబ్బు అవసరం లేదు లెండి. వాళ్ళిద్దరినీ పెళ్ళి చేసుకో నివ్వండి!" అన్నాడాయన.

"అదేం మాట? మీకు ఈ డబ్బు ఇవ్వలేకనే వాళ్ళిద్దరూ చాలా శ్రమపడ్డారు. డబ్బు తీసుకోండి," అన్నాడు పాపన్న.

శ్రీమంతుడు ఆ డబ్బు తీసుకుని లక్ష్మి చేతికి ఇచ్చేశాడు. వారిద్దరికీ పెళ్ళి చేయించి పాపన్న ఆ రోజే తన ఇంటికి వచ్చేశాడు.

—[పై సంచికలో మరొక సంఘటన]





# పెళ్ళిగండం

ఎంతో శ్రమపడి కుదిర్చిన సంబంధం కాస్తా తప్పిపోయినందుకు పాపన్న తల్లి చాలా విచారించింది. ఆమెకు కొడుకు మీద కోపం కూడా వచ్చింది. "నీ కెప్పుడూ ఇతరుల చింతే తప్ప నీ చింత లేకపోయె! అందుకే నీ కెవరూ పిల్ల నివ్వరు. ఆఖరుకు డబ్బుపోసి పిల్లను కొనుక్కుందామనుకుంటే, ఆ పిల్ల ఇంకెవరినో ప్రేమించిందని పరోపకారం పేరుతో డబ్బునూ, పిల్లనుకూడా పోగొట్టు కుంటివి. ఎలారా నీతో?" అన్నదామె.

"అమ్మా, పరోపకారం కన్న పెళ్ళి ఎక్కువా? ఒక్కనాటికికాదు. పరోపకారార్థ మిదం శరీరం అని మా గురువుగారు రోజూ అనేవారు. కాకపోయినా, కొనుక్కు తెచ్చు కున్న పెళ్ళాంతో ఏం సుఖపడతాను? నాకు తగినదాన్ని నేను ఏదోవిధంగా పెళ్ళాడతాను. నీవు విచారపడకు," అని తల్లికి చెప్పి పరోప కారి పాపన్న దేశాటనకు బయలుదేరాడు. ఒక్కొక్క గ్రామమే తిరిగి తనకు తగిన కన్య ఎక్కడ దొరికితే అక్కడే పెళ్లాడెయ్యా లని పాపన్న ఉద్దేశం.

రోజల్లా ప్రయాణంచేసి పొద్దువాలే సమ యానికి పాపన్న ఒక గ్రామం చేరాడు. అక్కడ ఆనాడు సంత జరిగింది. సంతలో సరుకు కొని పెద్దమూట కట్టుకుని, మోయ లేక మోస్తూ ఇంటికి పోతున్న ఒక ముసలా యన పాపన్నకు తటస్థపడ్డాడు.

"ఆ మూట ఇలా ఇవ్వండి. మీ ఇంటి దాకా పట్టుకొచ్చిపెడతాను," అని పాపన్న ముసలాయనతో అన్నాడు. అది చాలా బరువు ఉండటం చేత ముసలాయన సంతో షంగా పాపన్నను మోయనిచ్చాడు. ఇద్దరూ ముసలాయన ఇంటికి చేరేసరికి పొద్దు వాలి పోయింది. "ఇక నేను వెళ్ళివస్తాను, సెల విప్పించండి. పై గ్రామం ఎంతదూరంలో ఉందో ఏమిటో," అన్నాడు పాపన్న.



"తొందరపని ఏమీ లేకపోతే ఈ పూటకు మా ఇంట ఉండి తెల్లవారిన తరవాత వెళ్ళవచ్చునే. చాలా పొద్దుపోయింది," అన్నాడు ముసలాయన.

పాపన్న ఇందుకు సమ్మతించి, ఆ రాత్రి అక్కడే భోజనం చేసి, బయటి అరుగుపైన పడుకుని వెంటనే నిద్రపోయాడు.

ఈ ముసలాయన ఇంట ఒక విధవ కోడలూ, పెళ్ళిగాని మనమరాలూ ఉన్నారు. మనమరాలు పదహారేళ్ళది. పేరు మీనాక్షి. ఆ పిల్లకు పెళ్ళి కాకపోవటానికి కారణం ఉన్నది. ఆమె జాతకం చూసిన జ్యోతిష్కులు ఆమెకు వితంతుపయోగం ఉన్నదనీ, ఆమెను పెళ్ళి చేసుకున్నవాడు తప్పక చనిపోతాడనీ చెప్పారు. ఈ సంగతి చుట్టుపక్కల ఊళ్ళకుకూడా తెలిసిపోయింది. అందుచేత, మీనాక్షి అందమైన పిల్లే అయినప్పటికీ, ఆమెను చేసుకోవటానికి ఎవరూ సాహసించలేదు. అదీగాక, ముసలాయనకుకూడా జాతకాలలో పూర్తి నమ్మకం ఉండటంచేత, ఆ పిల్ల కోసం ఎక్కడా సంబంధాలు వెతకలేదు. పిల్ల పెళ్ళి భారమంతా దైవం మీద వేసేసి ఆయన చేతులు కట్టుకు కూచున్నాడు.

ఇలాటి పరిస్థితిలో గోరుచుట్టుపై రోకటిపోటన్నట్టుగా రాజుగారు ఒక శాసనం చేశారు—పదహారేళ్ళు నిండి పెళ్ళికాకుండా కన్యలను ఉంచరాదు; అలాటి కన్య లెక్కడైనా ఉంటే గ్రామాధికార్లు వారిని తమ కిష్టమైన ఎవరికో ఒకరికిచ్చి బలాత్కారంగా పెళ్ళి చేసెయ్యవచ్చు.

సరిగా ఈ రోజునే మీనాక్షికి పదహారేళ్ళు నిండాయి. రేపు గ్రామాధికారి వచ్చేసరికి ఆమెకు పెళ్ళి అయి ఉండకపోతే ఆమెను దారేపోయే ఏ దానయ్యకో ఇచ్చి ముడిపెట్టేస్తారు. కాటికి కాళ్ళుచాచుకుని కూచున్న ఏ ముసలాడైనా ఆమెను పెళ్ళాడటానికి సాహసించవచ్చు.

అరుగు మీద పాపన్న నిశ్చింతగా నిద్ర పోతుంటే ఇంట్లో ఉండే ముగ్గురూ ఈ విషమ సమస్య గురించి తలకాయలు పగలగొట్టు కుని చాలాసేపు నిద్రపోలేదు. తల్లి కూతుళ్లు కంటికీమంటికీ ఏకధారగా ఏడ్చారు. ముస లాయన వారిని సముదాయించలేక తాను కూడా కంట తడి పెట్టుకున్నాడు.

చాలా పొద్దుపోయి వాళ్ళు పడుకున్నాక మీనాక్షి మెల్లిగా లేచి బయటికి వెళ్ళింది. బావిలో పడి ఆత్మహత్య చేసుకుంటే పీడ విరగడ అయిపోతుందని ఆమె అనుకున్నది. మీనాక్షి లేచి వెళ్ళటం తల్లి గమనించి వెన కడితే వెళ్ళి, బావిలో పడబోతున్న కూతుర్ని పట్టుకుని, "తోడులేకుండా ఒక్కత్తె వే బావిలో ఎందుకు పడతావు తల్లీ? పడితే ఇద్దరమూ పడదాం!" అని గొల్లుమన్నది.

వీళ్ళిద్దరూ ఏడుస్తూ మాట్లాడే మాటలకు పాపన్న కాస్తా లేచి కూచున్నాడు. బావి దగ్గిర ఇద్దరాడవాళ్ళనూ చూశాడు. వాళ్లు బావిలో దూకటానికి పోటీలు పడటం విన్నాడు. గబ గబా అతను వాళ్ళ దగ్గిరికి వెళ్ళి, "బావిలోకి దిగాలంటే నేను దిగుతాను, మీవల్ల ఏమవు తుంది? ఇంతకూ బావిలో ఏమన్నా పడి పోయిందా ఏమిటి?" అని అడిగాడు.

ఈ సరికి ముసలాయన కూడా లేచి బయ టికి వచ్చాడు. ఆయన పాపన్నతో తమకు



వచ్చిపడిన సమస్య గురించి వివరంగా చెప్పి, "నాయనా, మాకు వచ్చిపడిన కష్టం ఒకరు ఆర్చేదీ, తీర్చేదీకాదు," అన్నాడు.

"ఇందులో కష్టం ఏముందండీ? కావలిస్తే నేను మరొకపూట మీ ఇంటనే ఉంటాను. రేపు గ్రామాధికారి రాగానే పిల్లకు పెళ్ళి అయిందని చెప్పండి. పిల్ల మొగుడెక్కడని అడిగితే నన్ను చూపండి. ఆ తరవాత రాజుగారి శాసనం బెడద తప్పుతుంది, నా దారిన నేను వెళ్ళిపోతాను," అన్నాడు పాపన్న.

"పెళ్ళి అయిపోయిందని అబద్ధమాడితే గ్రామాధికారి నమ్ముతాడా, నాయనా?, పురోహితుడి సాక్ష్యం కావాలి, నలుగురూ పెళ్ళి జరిగిందని అనాలి," అన్నాడు ముసలాయన.

పాపన్న కొంచెం ఆలోచించి, "అలా అయితే పెళ్ళితంతు జరిపించండి. నేనసలు గ్రామాల వెంట బయలుదేరిందే పెళ్లి కోసం. నా పనీ, మీ పనీ కూడా ఒనగూడినట్టవుతుంది," అన్నాడు.

"పిల్ల జాతకంలో దోషంవుంది, నాయనా. దాన్ని చేసుకున్నవాడు వెంటనే చనిపోతాడని మా ఊరి జ్యోతిష్కుడు బల్లగుద్ది చెప్పాడు," అన్నాడు ముసలాయన.

మీనాక్షికూడా, "వద్దు, వద్దు! నన్ను చేసుకుంటే ఆయన చచ్చిపోతారు," అన్నది.



"పరోపకారం చేసే అవకాశమే దొరకాలి గాని నేను చావటానికి భయపడేవాణ్ణి కాను. పరోపకారం కోసం ప్రాణా లర్పించినవాడు మరింత పుణ్యం సంపాదించుకుంటాడని మా గురువుగారు ఒకటికి రెండుసార్లు చెప్పే వారు," అన్నాడు పాపన్న.

గండం సంగతి తెలిసికూడా చేసుకుంటా నని పాపన్న అంటున్నాడు గనక ముసలా యన క్షణంలో పురోహితుణ్ణీ, గ్రామాధి కారినీ, ఇరుగుపొరుగు వాళ్ళనూ పోగుచేసి, పాపన్నచేత మీనాక్షి మెడలో తాళికట్టించాడు.

ఈ పురోహితుడే మీనాక్షి జాతకం చూసిన జ్యోతిష్కుడు. పెళ్ళయిన కొద్దిసేపటిలో పాపన్న చావకపోతే ఊళ్ళో తన మాటకు చిల్లిగవ్వ విలువ ఉండదనుకుని ఆ పురో హితుడు నీళ్లలో ఏదో మందుకలిపి పాపన్న చేత తాగించాడు. అది తాగిన కొద్దిసేపటికే పాపన్న స్పృహతప్పి పడిపోయాడు.

పెళ్లికి వచ్చిన ఆడవాళ్ళు గొల్లుమన్నారు. గ్రామాధికారీ తక్కిన పెళ్ళిపెద్దలూ కంగారు పడిపోయారు.

"నాకు మొదటనే తెలుసు. విధిని ఎవరు తప్పించగలరు? నిక్షేపంలాటి కుర్రవాడు. ఏ ఊరువాడో ఏమో! పాపం, నిష్కారణంగా ప్రాణం మీదికి తెచ్చుకున్నాడు," అన్నాడు పురోహితుడు.



పాపన్న నిజంగా చచ్చాడో లేదో చూడాలని ఎవరూ ప్రయత్నించలేదు. జ్యోతిషంలో వారికిగల నమ్మకం అటువంటిది!

పాపన్నను శ్మశానానికి తీసుకుపోవటానికి ఏర్పాట్లన్నీ జరిగాయి. అతనికి స్నానంకూడా చేయించారు. ఆ సమయంలో పాపన్న ఒక్క దగ్గుదగ్గి వాంతి చేసుకుని, కళ్ళుతెరిచి లేచి కూచుని, "ఏమిటి? ఏం జరిగింది?" అన్నాడు. అతని శరీరం దృఢమైనది. పురోహితు డిచ్చిన మందు అతనిపైన ఎక్కువ సేపు పనిచెయ్యలేదు.

కాని పురోహితుడు తన పీక మీదికి వచ్చిందని తెలుసుకుని మాట ఫిరాయించేసి అక్కడ ఉన్నవారితో, "అసలేం జరిగిందో చెబుతాను వినండి. ఈ అబ్బాయి మొహం చూస్తూనే దీర్ఘాయువని పసికట్టేశాను. కాని అమ్మాయి జాతకంలో ఉండే పీడ పోవటానికిగాను అపాయంలేని మందు ఒకటి నీటిలో కలిపి అబ్బాయి చేత తాగించాను. ఈ సంగతి ముందుగా మీకెందుకు చెప్పలేదంటారేమో! అతను నిజంగా చనిపోయినాడనుకుని మీరంతా ఒక శోకం పెడితే తప్ప దుష్టగ్రహ వీక్షణ దోషం సమసిపోదు. అబ్బాయి ఎప్పుడు లేస్తాడా అని ఇంధాకటి నుంచీ చూస్తూనే ఉన్నాను. లేవనే లేచాడు. ఇక ఇతని ఆయుర్దాయానికి ఎలాటి ప్రమాదమూలేదు," అన్నాడు.

ఈ మాటలు అందరూ నమ్మారు. పాపన్న తన భార్యతో అత్తవారింట మూడు నిద్రలు చేసి ఆమెతో సహా ఇంటికి తిరిగి వచ్చాడు. ఒక్క కానీ ఖర్చులేకుండా పాపన్న చక్కని చుక్కను భార్యగా తెచ్చుకున్నందుకు అతని తల్లి సంతోషించింది.

తనకు ఆపదలో అడ్డుపడటం కోసం తన ప్రాణాన్నికూడా ఇవ్వటానికి సిద్ధపడ్డాడని మీనాక్షి పాపన్నను దేవుడి కంటె ఎక్కువగా చూసుకుంటూ అతనితో సుఖంగా కాపరం చేసింది. [సమాప్తం]

